దేశాలను దురాక్రమిస్తారు. ఈ ధోరణినే సామ్రాజ్యవాద మంటారు. తా-మాక్రమించుకున్న దేశాలలో పరిశ్రమలనుపెంపొందనీకుండాచూస్తారు. ఈ పోటీలో విభిన్న సామ్రాజ్యవాదాలకు పోటీవచ్చి వీరిమధ్య తీవ్ర యుద్ధాలు చెలరేగుతాయి.

ప్రథమ మహాయుద్ధం ఎలావచ్చిందో. అలాగే రెండవయుద్ధంలో కొత్తగా బయలుదేరిన నాజీఫాసిస్టు సైనికశక్తులు తమకు వలసలకోసం దురాక్రమణ యుద్ధాన్ని కొనసాగించారు.

నేటికీ బ్రిటన్, ఫ్రాన్సు, పోర్చుగల్, డచ్చి సామ్రాజ్యాలు వలసలను పీడిస్తూనే ఉన్నవి. తమ ఆర్థిక సామ్రాజ్య విధానాన్ని అమెరికా అమలుజరుపుతునే ఉన్నది.

పీడిత అస్వతంత్ర ప్రజానీకం సంఘటితమై సామ్రాజ్యవాదంతో పోరాడుతునే ఉన్నది.

సిలోన్

ఇండియాకు దక్షిణాగ్రంలోనున్న దీవి. పోర్చుగీసు, డచ్చివారి తర్వాత ఈ దీవిని బ్రిటిష్‌వారు స్వాధీనం చేసుకున్నారు. 1796 లో దీనిని మదరాసు రాష్ట్రంలో చేర్చారు. కాని 1802లో ఇండియానుండి వేరుచేసి క్రౌన్‌కాలనీగా చేశారు. 1931 లో రాజ్యాంగ సంస్కరణలు జరిగినవి, రెండవ యుద్ధంతర్వాత దీనికి అధినివేశ ప్రతిపత్తి నిచ్చినట్టు ప్రకటనలు జరిగినా ఇది ఇప్పటికీ బ్రిటన్‌కు లోబడిన వలసదేశమే.

ఇంగ్లాండులో సగంపైశాల్యంకల దీవి. 53లక్షలు దాదాపు జనాభా- ఇందులో సింహళీయులు, తమిళులు ప్రధానజాతులు.

ఈ దీవిలో అయిదింట నాల్గువంతులు అటవీ ప్రాంతం. బియ్యం- వీరు దిగుమతి చేసుకోవాలి. కాఫీ తేయాకు తోటలలో భారతీయులు కూలీలుగా పనిచేస్తున్నారిక్కడ.

భారతీయులను తొలగించాలని. తరిమివేయాలని, పౌరహక్కులు వారికివ్వగూడదని అక్కడ కొత్తగా ఏర్పడిన ప్రభుత్వం తీవ్రంగా ప్రయత్నిస్తున్నది.

సోవియట్ యూనియన్

యూనియన్ అఫ్ సోషలిస్టు సోవియట్ రిపబ్లిక్కు అనేపేరునకు సంక్షిప్తరూపం-వైశాల్యం 9,127,000 చ॥మై॥ జనాభా 19 కోట్ల 30 లక్షలు దాదాపు.

1917 నవంబరు 7 విప్లవం పచ్చాక రష్యన్ సోషలిస్టు ఫెడరేషన్ సోవియట్ రిపబ్లిక్కు ఇందులో చేరినవి.

సోవియట్ యూనియన్ చరిత్ర లెనిన్ స్టాలిన్‌ల చరిత్రతోను కమ్యూనిజం చరిత్రతోను అనుబద్ధమై ఉన్నది.

1936 లో స్టాలిన్ రాజ్యాంగచట్టం అమలులోనికి వచ్చినది. సోవియట్లన్నీ ప్రజలతో ప్రత్యక్షంగా ఎన్నుకోబడతాయి. సుప్రీం సోవియట్ అత్యున్నత శాసననిర్మాణసంస్థ. ఇందులో రెండు సభలు. యూనియన్‌కౌన్సిల్ (ప్రతి 3 లక్షలమంది కొకప్రతినిధి) రెండవది జాతులసమితి (ప్రతి రిపబ్లిక్కు-కూ 24 గురు సభ్యులు) ఒక అధ్యక్షుని, ప్రతి రిపబ్లిక్కు 12 సభ్యులను ఈ కౌన్సిల్ ఎన్నుకుంటూ అలాగే మంత్రివర్గాన్ని ఎన్నుకుంటుంది. స్టాలిన్ మంత్రివర్గానికి అధ్యక్షుడు.

ఆర్థికవ్యవస్థ సోషలిస్టుపద్ధతికి చెందినది. పరిశ్రమలు సంఘానికి చెందినవి. ఉత్పత్తి పంపకాలు దేశం మొత్తంమీద ప్రణాళికాబద్ధములై నడుస్తాయి. వ్యవసాయం సమష్టివ్యవసాయ క్షేత్రాలద్వారా యాంత్రికమై నడుస్తుంది, ఒకరిని పనికిపెట్టుకొని పీడించి లాభం సంపాదించే వీలులేదిక్కడ.

రెండవయుద్ధంలో హిట్లర్ సైన్యాలను చావుదెబ్బతీసిన సోవియట్ తదనంతరం ఉత్పత్తి వినియోగాలను ప్రణాళికలద్వారా అత్యుత్తమ పద్ధతిలో నడుపుతూ ప్రజల జీవనస్థాయిని పెంచుతున్నారు. శాంతి సౌభాగ్యాలకోసం అహోరాత్రులూ శ్రమిస్తున్నారు.

స్పెయిన్ Spain

1,95,000 చ॥ మై॥ వైశాల్యం. జనాభా 2 కోట్ల 40 లక్షలు. ఆఫ్రికాలోని భాగాలతో కలిపితే మరి 40 లక్షలెక్కువ.

1921 దాకా రాచరిక ప్రభుత్వం. అందులో 1925 నుండీ దాదాపు జనరల్ పైమోడివెలరా నిరంకుశ నియంతృత్వం క్రింద ఉన్నది. 1931 ఏప్రిల్‌లో నియంతృత్వం తొలగింపబడి రిపబ్లిక్ ఏర్పడింది. ఆల్ఫొన్సోరాజు దేశం వదలిపెట్టాడు. 1936 ఫిబ్రవరి ఎన్నికలలో అతివాదులు గెల్చారు. ప్రజాసంఘటనకు 277 స్థానాలు, మితవాదులకు 132 స్థానాలు మధ్యపక్షాలకు 32 వచ్చాయి. 1436 మే॥న అజనా అధ్యక్షుడయ్యాడు. సోషలిస్టులు, కమ్యూనిస్టులు లేకుండా రిపబ్లిక్ ప్రభుత్వాన్నేర్పరచాడు.

భూసంస్కరణలు వగైరాలను ప్రభుత్వం అమలు జరిపింది. భూస్వాములు అభివృద్ధినిరోధకులు దీన్ని నిరోధించారు.

1936 జులై 18 న అభివృద్ధినిరోధక బలంతో జనరల్ ఫ్రాంకో ప్రభుత్వంపై తిరుగుబాటు చేశాడు. జర్మనీ ఇటలీ ఫాసిస్టు శక్తులతనికి ప్రోత్సాహ ప్రోద్బలాలిచ్చాయి. స్పెయిన్ అంతర్యుద్ధం మూడేళ్లు జరిగింది. సమష్టి రక్షణకు సమాయత్తం కావాలన్న ప్రజావాణిని బ్రిటన్ ఫ్రాన్సులు వినలేదు. ఆఖరుకు 1939 మార్చిలో ఫ్రాంకో గెలిచాడు. మిలిటరీ నియంతృత్వం ఏర్పరచాడు. గత రెండవ ప్రపంచయుద్ధంలో అక్షరాజ్యాలకతడు ప్రాపుగానున్నాడు. బాహాటంగా యుద్ధంలోకి దిగకున్నా, ఇతని వైఖరిని చూచి మిత్రరాజ్యాలు ఇతనితో మైత్రిని నెరపలేదు.

కాని తిరిగీ ఇప్పుడు (1951) ఫ్రాంకో స్పెయిన్‌ను అట్లాంటిక్ రాజ్యాలకూటమిలో చేర్చాలని అమెరికా రాయబారాలు నడుపుతున్నది. బ్రిటన్, ఫ్రాన్సులుకూడ ఇందుకు విముఖంగా నున్నవి. సోవియట్ మీద ద్వేషంతో ఫాసిస్టు బిడ్డైన ఫ్రాంకోతో సంప్రతింపులు నడిపేందుకు చేతులు కలిపేందుకు అమెరికా సిద్ధపడింది.

**స్పెయిన్ అంతర్యుద్ధం.**

1936 జులై లో స్పానిష్ మొరాకోలో జనరల్ ఫ్రాంకో తిరుగుబాటు చేయడంతో ఆరంభమయింది. స్పెయిన్‌లోని సైనిక స్థావరాలన్నీ

దాదాపు రెండవరోజే తిరుగుబాటుచేశాయి. తిరుగుబాటుదారులు దక్షిణం లోను, వాయవ్యంలోను అధికారం లాక్కున్నారు. ప్రజాసంఘటన ప్రభుత్వం ఉత్తర మధ్య తూర్పు భాగాలలో తిరుగుబాటు నణచివేయ గలిగినది. ఫ్రాన్సును ఆయుధాలకై ప్రభుత్వం కోరినది. కాని ఫ్రెంచి ప్రభుత్వం నిరాకరించింది. మరిజర్మనీ ఇటలీలేమో ఫ్రాంకోకు ఆయుధా లంపుతూ వచ్చినవి. రణబలంతో కేవలం దేశభక్తిమాత్రమే ఆయుధంగాకల మిలిషియాను ఇతను మాడ్రిడ్ కోటవాకిలివద్దకుతరమగలిగాడు. దేశదేశాలనుంచి స్వచ్ఛంద సేవకులెందరో కలిసి అంతర్జాతీయదళాన్ని ఏర్పరచి స్పెయిన్ ప్రజాప్రభుత్వ పక్షాన నిలిచి పోరాడారు. వీరిలో రాల్ఫ్‌ఫాక్స్, కాడ్వెల్‌లాంటి మహా మేధావులు రచయితలు ఉన్నారు.

2 1/2 సంవత్సరాలు ఫ్రాంకో మాడ్రిడ్‌నుముట్టడించాడు. జర్మనీ టాంకులను, ఫిరంగులను, విమానాలను, సైనిక నిపుణులను ఫ్రాంకోకు పంపినది. ఇటలీ లక్షసైనికులను పంపింది. యుద్ధసమయంలో అంతర్జాతీయ దళం 30వేలవరకు పెరిగింది. రిపబ్లిక్కునకు రష్యా టాంకులను విమానాలను పంపి సాయపడినది. కాని మిగత ప్రజాస్వామిక రాజ్యాలనేవి రిపబ్లిక్ ప్రభుత్వానికి సాయపడక తటస్థ విధానంపేర ఫాసిజానికి స్పెయిన్నుబలిచేసినవి. అరాచకవాదులు ప్రభుత్వంతో విభేదాలుచూపారు. తీవ్రవాద ప్రభుత్వంపోయి మితవాద ప్రభుత్వం ఏర్పడింది. అయినా ఫ్రాంకో దురాక్రమణ ఆగలేదు.

1937లో బిల్బోతోపాటు బాస్కు ప్రాంతాన్ని ఫ్రాంకో ఆక్రమించాడు. 1938లో అతని సేనలు టెరూల్‌నుండి మధ్యధరా సముద్రాన్ని చేరి రిపబ్లిక్ స్పెయిన్‌నుండి కటలోనియాను వేరుపరచివేశాయి. 1938 డిసెంబరు 24తేదీ ఫ్రాంకో కటలోనియాపై పెద్దయెత్తున దాడిజరిపాడు. ఆఖరుకు రిపబ్లిక్ బలం శిథిలమయి మూడువారాలలో బార్సిలోనా పతనమయినది. 1939 ఏప్రిల్ 4వ తేదీ మాడ్రిడ్‌పట్టణం, మధ్యరంగం ఫ్రాంకోకు లొంగిపోయినది.